# ఆత్మషట్కము-4



## (శ్రీ శంకరాచార్యులవారు)

శ్లో॥ ఆభాతీదం విశ్వమాత్మన్యసత్యం
సత్యజ్ఞానానన్దరూపే విమోహాత్
నిద్రామోహాత్ స్వప్నవత్ తన్నసత్యం
శుద్ధః పూర్ణో నిత్య ఏకః శివోఽహమ్.

తా॥ నిద్రయందు స్వప్న పదార్థములు అసత్యములైనను సత్యములుగ గోచరించునట్లు, సత్యజ్ఞానానందరూపుడనగు నా యందు అజ్ఞానవశమున ఈ జగత్తు గోచరించుచున్నది. ఇది సత్యము కాదు. నేను వాస్తవముగ శుద్ధుడను, పూర్ణుడను, నిత్యుడను, అద్వితీయుడను, శివస్వరూపుడను అయియున్నాను.

వ్యాఖ్య :—జగత్తుయొక్క మిథ్యాత్వమును నిరూపించుటకు స్వప్నము చక్కని దృష్టాంతము. కనుకనే అధ్యాత్మ వాఙ్మయమున మహనీయులు ఈ స్వప్న దృష్టాంతమును ఎక్కువగ వాడుచుందురు. స్వప్న పదార్థములు స్వప్న సమయమున నిద్రామోహముచే సత్యములుగ గన్పట్టును. కాని మేలుకొనిన తరువాత అవియన్నియు కల్పితములని తేలిపోవును. అట్లే జాగ్రదవస్థయందు కనిపించు ఈ జగత్తున్ను సచ్చిదానందరూపమగు ఆత్మయందు కేవలము అజ్ఞానవశమున కల్పింపబడినదేయగును. వాస్తవముగ దానికి అస్తిత్వములేదు. కనుకనే మహనీయులు అట్టి మిథ్యావస్తువు నందు విరక్తిగలిగి సత్యమగు ఆత్మయందే స్థితిగలిగి




సంపుటము : 25 | అగస్టు 1993 | సంచిక 8

## సంపాదకవర్గము

గౌరవ సంపాదకులు :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి M A ,D Litt. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య M. A

సంపాదకులు : బి. ఈశ్వర్

సహాయ సంపాదకులు : బోధచైతన్య, M A ఓంప్రకాశ్ B.Sc

సంవత్సర చందా : రూ. 30/-లు

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex 0475 362 ANIL Fax . 0866-63017

శాశ్వత చందా : రూ. 300/-లు.

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78


చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

## అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక



మురళీస్వరాల గోవిందా!
లీలావినోదాల గోపాలా!
జ్ఞానజ్యోతుల గీతాచార్యా!
కరుణించి కాపాడే శ్రీకృష్ణా! నీకు నమశ్శతాలు.



## (కృష్ణావతారము-8)

ధనాత గోధనం యేన గోవర్ధనేన
వ్యరక్షి ప్రతాపేన గోవర్ధనేన
హతా రాతిచక్రీ రణధ్వస్తచక్రీ
పదధ్వస్తచక్రీ స నః పాతు చక్రీ.

వర్షధారలనుండి గోసమూహములను రక్షించు నిమిత్తము గోవర్ధన పర్వతమును పైకెత్తినవారును, శత్రుజాలమును నిర్మూలించిన అవక్ర పరాక్రమశాలియు, కాళియసర్పమును నిర్జించినవారును, చక్రాయుధమును ధరించినవారును అగు శ్రీకృష్ణమూర్తి మమ్ములను రక్షించుగాక! అట్టి శ్రీకృష్ణస్వరూపుడైన పరమాత్మకు నమస్కారము.

ఓం

Man is a heinous criminal to himself if he violates the most sacred law of cheerfulness and peace.

ఉత్సాహము, ఉల్లాసము, శాంతి- కలిగియుండుట అను మహాపవిత్రమగు నియమమును, దేవశాసనమును, ఉల్లంఘించినచో మనుజుడు గొప్ప నేరస్థుడే యగును.



**A**t your very threshold, Narayana Himself in the form of a poor beggar is dying of starvation! Instead of giving him anything, would you only satisfy the appetites of your wife and children with delicacies?

మీ ఇంటిముందే నారాయణుడు ఒక బిచ్చగాని రూపమున ఆకలితో అలమటించుచు పడియున్నాడు. అతనికి అన్నము పెట్టక మీరు, మీ భార్యాబిడ్డలు పంచభక్ష్య పరమాన్నములతో భుజించుట న్యాయమా?

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ఈ ప్రపంచమున ఆత్మ, అనాత్మ, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, దృక్కు, దృశ్యము, అన్నియు ఏకమై అజ్ఞానికి గన్పట్టుచున్నవి. వానిని విడదీయుటయే జ్ఞానము. వానిని విభజించి జడమును జడముగను, చైతన్యమును చైతన్యముగను భావించుటయే జ్ఞానము. కనుకనే 'విభాగ' యోగములను పేరుతో కొన్ని అధ్యాయములు గీతయందు ప్రత్యేకముగ చెప్పబడినవి. (క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము, గుణత్రయ విభాగయోగము, దైవాసుర సంపద్విభాగ యోగము, శ్రద్ధాత్రయ విభాగయోగము అని) 'విభాగ'మనగా కలిసియున్న వానిని విడదీయుట *(Division)*అని అర్థము.

మంచి, చెడ్డ కలిసియున్నప్పుడు వానిని వేఱుచేసి, మంచిని గ్రహించి చెడ్డను విసర్జించుట లోకములో పరిపాటి. గుజ్జు, తొక్కు రెండును కలిసియున్న అరటిపండును పిల్లవానికిచ్చినపుడు అతడు వెంటనే దానిని ఒలిచి గుజ్జును తిని, తొక్కును పారవేయును. ప్రతి దినము ఉదయముననే ఇండ్లయందు గృహిణులు బియ్యము, రాళ్లు

కలిసియున్న వస్తువును చేటలో వేసికొని బియ్యమునట్టిపెట్టుకొని రాళ్లను ఏరిపారవేయుదురు.

అట్లే ఆత్మ, అనాత్మ కలిసియున్న ఈ ఉపాధియందుగాని, దృశ్యప్రపంచమునందుగాని వానిని విభజించి ఆత్మయందే చిత్తమును నెలకొల్పి అనాత్మయందు విరక్తికలిగియుండవలెను. ఇదియే జ్ఞానము. క్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని వేఱుచేసి క్షేత్రజ్ఞుడే తానని భావించి క్షేత్రము యెడల అనాసక్తిని కలుగజేసికొనవలెను. 'అస్తి, భాతి, ప్రియ, నామ, రూపము' లను ఐదింటితో గూడిన ప్రతి వస్తువునందును మొదటి మూడును సత్యమనియు తక్కిన రెండును అసత్యమనియు భావము కలిగియుండవలెను.

ఇక క్షేత్రమనగా నేమియో, క్షేత్రజ్ఞుడనగా నెవరో యోచించెదము. పంచ మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, శబ్దస్పర్శాదివిషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాది సమూహము, అంతఃకరణ వృత్తులు మున్నగునవి యన్నియు క్షేత్రమనబడును. దీనిని తెలిసికొను ప్రజ్ఞారూపమగు చైతన్యమే క్షేత్రజ్ఞుడు.

'ఓ అర్జునా! సమస్త క్షేత్రములందును క్షేత్రజ్ఞుడను నేనేయని యెఱుగుము', అని శ్రీకృష్ణపరమాత్మ వచించిన అమోఘమగు సత్యము జనులపాలిటి వరప్రసాదమైయున్నది. ఏలయనిన సాక్షాత్ పరంధాముడు, వైకుంఠనాథుడు, విశ్వవ్యాపక చిన్మూర్తి ప్రతివానియొక్క హృదయాంతరాళముననే వెలుగొందుచున్నాడేకాని దూరమున లేడని దీనిచే స్పష్టమగుచున్నది. వారు అతి సమీపముననే వర్తించుచున్నారు. సర్వసాక్షియై మనలోనే ప్రకాశించుచున్నారు. కాబట్టి ప్రయత్నముచే మనము వారిని తప్పక పొందగలము— అను ధైర్యము దీనిచే కలుగుచున్నది.

'సర్వక్షేత్రేషు'— అని చెప్పబడినందువలన జాతి, మత, కుల విచక్షణ లేక సమస్త చరాచరములందును క్షేత్రజ్ఞుడగు పరమాత్మ అధివ

సించియున్నాడని విస్పష్టమగుచున్నది. విచారణచే అన్నమయ, ప్రాణ మయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశములను వేఱుచేసి చూసినచో వాని యభ్యంతరమున సర్వసాక్షియగు ఆత్మ ప్రతి వారియందు తప్పక అనుభూతము కాగలదు. అట్టి ఆత్మానుభూతియే జ్ఞానము యొక్క ఫలము. అదియే మోక్షము. కాబట్టి జ్ఞాన విచారణ జీవుని మహోన్నత అధ్యాత్మిక శిఖరములకు గొనిపోయి, స్వస్వరూపానుభవము ద్వారా జీవుని దేవునిగ జేసి పరమానందమును, జీవన్ముక్తిని ఇచటనే కలుగజేయుచున్నది. (జ్ఞానవాన్ మాం ప్రపద్యతే.)

జ్ఞానము కలిగిన పిమ్మట మనుజునిచే ఆచరింపబడు కర్మ మహో పవిత్రమై, నిర్లేపమైయుండును. ఏలయనిన, బుద్ధికి ఆవలనున్న (బుద్ధేః పరం) పరమాత్మను ఎఱిగినవాడు, అచ్చోట స్థితిని బొందినవాడు, దేహేంద్రియాది సంఘాతమునంతను, అంతఃకరణమును సాక్షిగ వీక్షించును. అత్తఱి తాను కర్తకాడు. దేహేంద్రియాదులు వాని వాని పనులను అవి చేసుకొనుచుండును. వానియందేమియు తగుల్కొనక అతడు నాశరహిత మగు సనాతన పరబ్రహ్మమునందే నిలుకడకలవాడై స్వస్వరూపానుభవము నొందుచు, అసక్త బుద్ధి గల్గియుండును.

జ్ఞానియగువాడు ఒకవేళ లోకహితార్థము కర్మచేసినను అట్టి అసక్త బుద్ధితోనే, నిర్లిప్త మానసముతోనే చేయును. అత్తఱి ఆ కర్మ పరమపునీతమై అత్యద్భుత మహిమతో గూడియుండును. జ్ఞాని చేయు కర్మకున్ను, అజ్ఞాని చేయు కర్మకున్ను గల వ్యత్యాసమిదియే. అజ్ఞాని దేహేంద్రియాది సంఘాతముతో నైక్యమై, 'దేహమే నేను' అని భావించి సక్తచిత్తుడై కర్మల నాచరించి బద్ధుడగును. జ్ఞాని 'నేను దేహమును కాను' సచ్చిదానందరూపమై, జనన మరణరహితమై సనాతనమై, అవ్యయమైనట్టి ఆత్మయే నేనుగాని నశ్వరదేహాది సముదాయమును కాను– 'తద్బ్రహ్మనిష్కల మహం నచభూతసంఘః' అని దృఢముగ నిశ్చయించి, అహంభావమును పారద్రోలి, మమత్వరహితుడై, కర్తృత్వమును వీడి అసక్తబుద్ధితో కర్మలనాచరించి

ముక్తుడగును. కావున కర్మలనాచరించుటకు పూర్వము వానియందు కుశలత్వము నెట్లు సంపాదింపగలరో ఆ రహస్యము నెఱుగవలెను. అట్టి కర్మకుశలత్వము జ్ఞానమువలననే కలుగును.

కనుకనే శ్రీకృష్ణపరమాత్మ రెండవ అధ్యాయమున తొలుదొల్తనే జ్ఞానమునుపదేశించి, కర్మయందు కుశలత్వము *(Non Attachment)* ను సంపాదించు కీలకమును బోధించి ఆ పిదప కర్మయోగమునకుపక్రమించెను. 'యోగస్థః కురుకర్మాణి' – (ఆత్మయందు నిలుకడ కలిగి అనక్తబుద్ధితో కర్మలచేయుము) అను మహామంత్రమును అత్తఱి బోధింప మొదలిడెను. కాబట్టియే మహాత్ములు జ్ఞానప్రాప్త్యనంతరము చేయు లోకసేవ, సామాన్యులు చేయు సేవకంటె ఎన్ని రెట్లో అధికమై, నిష్కళంకమై యొప్పును. జ్ఞానమును పొందిన పిదప వారివారి సంస్కారమునననుసరించి కొందఱు నివృత్తి నవలంబించుచుందురు. మఱికొందరు ప్రవృత్తిని స్వీకరించినప్పటికిని వారికి నివృత్తి ఫలమే కలుగును.

శ్రీకృష్ణుడు, జనకుడు, ఇక్ష్వాకువు మొదలగు చక్రవర్తులు, శంకరాచార్యులు, వివేకానంద మొదలగు సన్యాసులు జ్ఞానానంతరము లోకహితార్థము ఎంతయో కర్మకాండనాచరించిరి. అయినను జ్ఞానప్రభావముచే వారలను కర్మ ఏమాత్రము బంధింపకుండెను. కాబట్టి ప్రవృత్తికైనను, నివృత్తికైనను జ్ఞానము సర్వజీవులకును అవశ్యము సంపాదింపదగియున్నది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ–

నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే (4–38)

'జ్ఞానముతో సమానమైన పవిత్రమగు వస్తువీ ప్రపంచమున ఎచటను లేదు, అని గీతయందు జ్ఞానప్రభావమును ఎలుగెత్తి చాటెను. అయితే అపరోక్షజ్ఞానము హృదయమున చక్కగ కలుగవలెననిన గీత 13వ అధ్యాయమున చెప్పబడిన అమానిత్వాది జ్ఞానగుణములను సాధకుడు చక్కగ నభ్యసించవలెను. అట్టి జ్ఞానగుణములనభ్యసించనిదే జ్ఞేయవస్తువగు పరబ్రహ్మము అనుభూతము కానేరదు. OO

# వినోదము-విజ్ఞానము

ప్రపంచంలో ఎందరో పుట్టుచున్నారు, చచ్చుచున్నారు. ఈ దృశ్యాన్ని ప్రత్యక్షంగా జనులు చూస్తున్నారే కాని ఆ సంఘటనలను గూర్చి ఆలోచించేవారు చాల తక్కువ. జీవుడు ఎక్కడి నుండి వస్తున్నాడు? ఎక్కడికి పోతున్నాడు? అనే విషయాన్ని గురించి ఆలోచించువారు చాల స్వల్పము. జీవితం మూణ్ణాళ్ళముచ్చట అని తెలిసికూడ దృశ్యభోగాల వెంట పరుగెడ్తూ కాలక్షేపం చేస్తున్నారు.

వివేకవంతుడగువాడు జీవితాన్ని గూర్చి చక్కగ పర్యాలోచించి జనన మరణాల నుండి తప్పించుకోటానికి ఉపాయాలను వెతకాలి. జన్మదుఃఖం, జరాదుఃఖం, మరణదుఃఖం మున్నగు దుఃఖాలనుగూర్చి చక్కగ విచారించి ఆ దుఃఖాలను తొలగించటానికి మార్గమేదియో అన్వేషించాలి.

బుద్ధుడు ఒక్క వృద్ధుణ్ని చూచి, ఒక్క శవాన్ని చూచి తన జీవితాన్నే మార్చుకొన్నాడు. పరమవైరాగ్యాన్ని పొందాడు. వార్ధక్యాన్ని, మరణాన్ని దాటటం ఎట్లా? అని ఆలోచన మొదలుపెట్టాడు. పరమ వైరాగ్యాన్ని పొంది రాజ్యాన్ని కూడ తిరస్కరించి ఏకాంతమునకు వెళ్ళి, ప్రపంచ పరిస్థితులను గూర్చి చక్కగా ఆలోచించి, ధ్యాననిమగ్నుడై నిర్వాణస్థితిని బడసి తరించాడు.

కాని సామాన్యులు ప్రతిరోజూ ఎందరో వృద్ధులను, ఎన్నియో శవాలను చూస్తున్నప్పటికి వారిలో ఏ మాత్రం మార్పు కనిపించటం లేదు. ఈ ప్రపంచం శాశ్వతమని, బంధుమిత్రాదులు ఎల్లకాలం యుంటారని, ధనసంపాదనయే ముఖ్యమని భావించి వాటికొరకే అహర్నిశలు పాటుపడ్తున్నారు.

విజ్ఞుడైనవాడు వాస్తవస్థితిని గూర్చి చక్కగ విచారించి, దృశ్యవస్తువులు క్షణికములని భావించి వాటివెంట పరుగెత్తక సత్యమగు ఆత్మను గూర్చియే అన్వేషించాలి. బహిర్ముఖత్వాన్ని విడనాడి, అంతర్ముఖత్వం స్వీకరించాలి. పూర్ణశాంతిగాని, పూర్ణసుఖంగాని బయటలేవని నిశ్చయించి మనస్సును అంతర్ముఖం చేసుకోవాలి. ➪

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

దేనిని తెలిసికొనకపోవుటవలన ఈ సమస్త ప్రపంచము తోచుచున్నదో, ఏ ప్రపంచము ఆత్మ ప్రబోధముచే వెంటనే వినష్టమైపోవుచున్నదో, అట్టి విశుద్ధమై, మనోవాక్కులకు అతీతమై, విముక్తమై, నిత్యమైనట్టి పరబ్రహ్మమే నేను అయియున్నాను. ౦౦

ఎందరో రాజులు ప్రాపంచిక విషయభోగాలను అనుభవించి అనుభవించి తుదకు మట్టిలో కలిసిపోయినారు. వారి వైభవాలచే వారు ఏ మాత్రము శాంతిని బడయజాలకుండిరి. వారి జీవితాలు నిరర్థకములైపోయాయి.

కాబట్టి విజ్ఞుడైనవాడు లోకస్థితిని చక్కగ విచారించి దృశ్యపదార్థాల కొరకు అఱ్ఱులు చాచక, దృగ్వస్తువగు ఆత్మకొరకే ప్రయత్నించాలి. వైరాగ్యం కలిగి మనస్సును అంతర్ముఖం చేసుకొని, ధ్యానాదులను అభ్యసించి ఆత్మానుభూతిచే పూర్ణ శాంతిని పొందాలి. జననమరణాదులను చూచి, ప్రపంచం యొక్క చంచలత్వాన్ని చూచి, నశ్వరత్వాన్ని చూచి వైరాగ్యం పొందనివాడు జడమైన రాతిబొమ్మవంటివాడే యగును. అట్టివాడు నడచుచున్న కొయ్యబొమ్మవంటివాడేయని కవులు వర్ణించారు.

కావున అట్టి జడస్థితిని పొందక చైతన్యవంతులై, అమృతస్వరూపులై, ఆత్మానుభూతి కలవారై పవిత్ర మానవజీవితాన్ని సార్థకం చేసుకోవాలి. బంధవిముక్తికై అనవరత కృషి సలపాలి. మోక్షానందాన్ని పొంది జీవితాన్ని చరితార్థం చేసుకోవాలి.

ఈ భావాలనే క్రింది శ్లోకము నిరూపిస్తున్నది-

## డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A.,Ph.D.

(తిరుపతి)

ప్రశ్న : *జ్ఞానాలు మూడు రకాలంటారు కదా! సాత్త్విక–రాజస–తామస భేదాలు గల ఆ జ్ఞానాల స్వరూపం ఎలా ఉంటుంది?*

**జవాబు :** విభిన్నంగా ఉండే అన్ని భూతాల్లోను ఒక్కటై, నిత్యంగా, అంతరాత్మగా ఉండే పరమాత్మను గుర్తించే జ్ఞానమే సాత్త్వికజ్ఞానం దీన్నే విజ్ఞానమని అంటారు. లోకంలో ఉన్న పదార్థాలనన్నింటిని వేఱు వేఱుగా అనేక రకాలుగా, అనేక వస్తువులుగా ఏ జ్ఞానం గ్రహిస్తుందో దాన్ని రాజసజ్ఞానమంటారు. ఈ రాజసజ్ఞానం కలవారికి దేవతలు గూడ విష్ణువని, శివుడని, సూర్యుడని, అంబ అని, గణపతి అని, వేఱు వేఱుగా కనబడతారు. నామ రూప విభాగాన్ననుసరించి దైవభేద భావం వీరికి కలుగుతుంది. ప్రపంచంలో ఉన్న ఏదో ఒక కార్యైకదేశమైన పదార్థాన్నే కారణంగా గ్రహించడం, శరీరాన్నే ఆత్మ అనుకోవడం, కార్య కారణభావం లేక, యథార్థానికి దూరమై, నీచమైనట్టి జ్ఞానం తామసజ్ఞానమౌతుంది.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ । (భగవద్గీత 18–20)
(20 నుండి 22 శ్లోకం వరకు)

ప్రశ్న : *మనం చేసే పనులు సాత్త్వికాలు కొన్ని, రాజసాలు కొన్ని, తామసాలు కొన్ని. వాటి ప్రత్యేక లక్షణాలేమిటి? వేటిని సాత్త్విక కర్మలంటారు? ఎలాంటి వాటిని రాజస కర్మలంటారు? తామసకర్మలెలా ఉంటాయి?*




- సమాజమును సరిదిద్దుటకు ముందుగా తమ్ము తాము సరిదిద్దుకొనవలెను.
- భిక్షాధికారికి ఆకలి బాధ, లక్షాధికారికి చాలదను బాధ. -ఈ విధముగ దుఃఖము ఇరువురికి సమానముగనే యుండును.
- ఐశ్వర్యమున్నను, ఆరోగ్యమున్నపుడే దానిని అనుభవించి ఆనందించుటకు వీలుపడును.
- చేసిన తప్పును సవరించుకొని తిరిగి తప్పులు చేయకుండుట మానవ ధర్మము.
- కష్టములు కలిగినప్పుడు ఓర్పు కలిగి ఉండుట, ఇతరులకు కష్టములు కలిగించకుండుట తపస్సు.
- స్నానము వలన బాహ్యశుద్ధి, ధర్మాచరణ వలన అంతశ్శుద్ధి కలుగును.
- విరక్తి కలుగనిచో విముక్తి కలుగనేరదు.



⇨ **జవాబు :** రాగద్వేషప్రేరితం కానిది, ఆసక్తి లేనిది, ఫలాసక్తి లేనివానిచే విధ్యుక్తమార్గమున చేయబడినది సాత్త్వికకర్మ అవుతుంది. ఏదో ఒక ఫలాన్ని ఆశించి, నేను దీన్ని చేస్తున్నాననే అహంభావంతో, చాలా శ్రమపడి చేసే కర్మ రాజసకర్మ అవుతుంది. బంధాన్ని కలిగిస్తుందని, నాశాన్ని కలిగిస్తుందని, హింసాత్మకమైందనీ ఆలోచించకుండానే, తన శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకోకుండా, అజ్ఞానంతో చేసే కర్మ తామసకర్మ అవుతుంది.

నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే । (భగవద్గీత 18-23)
(23 నుండి 25 శ్లోకం వరకు)



# శ్రీ వివేకానందస్వామి

1. లెండు! కార్యాచరణమునకు గడంగుడు. ఎన్నాళ్ళీట్లు పడియుండుట! ఈ లోకమున జన్మించినదానికి గుఱుతుగా ఏదియో యొక మహత్కార్యమును చేసి పొందు! లేకున్న మీకున్ను, ఈ వృక్షములకును, శిలలకున్ను ఏమి భేదము కలదు? అవి కూడ పుట్టి, పెరిగి, నశించుచున్నవి గదా!
కావున, ధైర్యవంతులైయుండుడు! నా బిడ్డలకు అన్నిటికంటె అధికముగా ధైర్యముండవలెను. అది ఏ కారణము వలన గూడ తగ్గరాదు. నాయనలారా! మహోన్నతములగు సత్యములను జనులకు బాహాటముగ బోధింపుడు! భయపడకుడు!
2. హిందూదేశమును సాంఘిక, రాజకీయ భావములతో నింపుటకు పూర్వము ఆధ్యాత్మిక భావములతో పరిపూర్ణమొనర్పుడు. మన ఉపనిషత్తులందును, స్మృతులందును, పురాణములందును, నిగూఢముగనుండు మహోన్నత సత్యములను ఆ గ్రంథములలో నుండియు, మఠములలో నుండియు, అరణ్యములలో నుండియు, ప్రత్యేక వర్గముల స్వాధీనములో నుండియు బయటకు గొని వచ్చి దేశమందంతటను- ఉత్తరాగ్రము నుండి దక్షిణాగ్రము వఱకును, హిమాలయముల నుండి కన్యాకుమారి వఱకును, సింధునది నుండి బ్రహ్మపుత్ర వఱకును, కార్చిచ్చువలె వ్యాపించునట్లు ధారాళముగ వెదజల్లవలయును.
3. తల్లియొక్క హృదయము, శూరునియొక్క అకుంఠితదీక్ష, మలయమారుతము (దక్షిణదిశయందలి వాయువు) యొక్క మాధుర్యము, జాజ్వల్యమానములై నిరర్గళములైనట్టి ఆర్యుల హోమాగ్ని వేదికలందు వెలయు పరమ పవిత్రమగు శోభ, దివ్యబలము-వీని నన్నిటిని నీవు పడయుదువుగాక! ఇంతియే కాదు, పూర్వీకులూహింపనటువంటి యెన్నియో సుగుణములను నీవు పొందుదువుగాక! మఱియు భావిభారత పౌరునకు నీవు బంధువై, మిత్రుడవై, సేవకుడవై వర్ధిల్లుదువుగాక!!



సీతారామ్ సీతారామ్ । సీతారాం జయ సీతారామ్
రామ్‌రామ్ సీతారామ్ । రావణసంహర సీతారామ్
జానకిరమణ సీతారామ్ । దానవహరణ సీతారామ్
పంకజనయన సీతారామ్ । పన్నగశయన సీతారామ్
పావననామ సీతారామ్ । పాపవినాశక సీతారామ్
భద్రగిరీశ సీతారామ్ । భక్తవత్సల సీతారామ్.

రామ రామ రామ రామ । రామనామ తారకమ్
రామ కృష్ణ వాసుదేవ । భక్తి ముక్తి దాయకమ్
జానకీ మనోహరం । సకల లోకనాయకమ్
శంకరాది సేవ్యమాన । దివ్యనామ కీర్తనమ్.

3. జయ జయ రామ జానకిరాం । జయ రఘునందన సీతారామ్
తాపసరంజన పట్టాభిరాం । దానవభంజన కోదండరామ్
రఘుకులభూషణ రాజారాం । కౌసల్యాతనయా పావనరామ్.

రఘుపతి రాఘవ రాజారాం । పతితపావన సీతారామ్
సుందరవిగ్రహ మేఘశ్యాం । గంగాతులసీ సాలగ్రాం
రామరామ జయ రాజారాం । రామరామ జయ సీతారామ్.

4. శ్రీరాం జయరాం । జయ జయ రామ ఓమ్
శ్రీరాం జయరాం । జయ జయ రామ ఓమ్.
రామలక్ష్మణ జానకీ । జయబోలో హనుమాన్ కీ.

5. దశరథనందన రామరామ । దశముఖమర్దన రామరామ
పశుపతిరంజన రామరామ । పాపవిమోచన రామరామ
మేఘశ్యామ రామరామ । రవికులసోమ రామా రామా. ()()



# శ్రీ అరుణాచలము

## ఓంప్రకాశ్

అరుణాచలాన్నే తమిళంలో తిరువణ్ణామలై అంటారు. ఈ పర్వతం ఎంతో పవిత్రమైనదని భావిస్తారు. నందీశ్వరుడు భూమిమీద స్థాపించిన మూడు కైలాస శిఖరాలలో ఇది ఒకటి. దక్షిణదేశంలోనున్న పంచతత్త్వలింగాలలో అగ్నిలింగం, అరుణాచల పర్వతరూపంలో ఉంది. అంటే అరుణాచలం సాక్షాత్తు అగ్నిలింగం అన్నమాట!

విల్లుపురం–గూడూరు లైనులో విల్లుపురం నుండి 42 మైళ్లదూరంలో తిరువణ్ణామలై స్టేషను వస్తుంది. స్టేషను నుండి అరమైలు దూరంలో అరుణాచలం దర్శనమిస్తూ వుంటుంది. కాంచీ–తిరుపతి ప్రాంతాల నుండి కూడా బస్సుల ద్వారా ఇక్కడికి రావటానికి సౌకర్యాలున్నాయి. అరుణాచలంలో ఎన్నో ధర్మశాలలున్నాయి. అనేక దుకాణాలు కూడా వున్నాయి.

అరుణాచలానికి క్రింద, పర్వతానికి ఆనుకునే ఒక విశాలమైన ఆలయం . ది. ఈ ఆలయగోపురం–దక్షిణ భారతంలోనున్న ఇతర ఆలయ గోపురాలన్నింటికన్నా చాలా వెడల్పయినదని అంటారు. పది అంతస్తుల ఎత్తు గలిగిన నాలుగు గోపురాలు, ఆలయానికి నాలుగువైపులా ఉన్నాయి. ఆలయం లోపల కూడా చిన్న–చిన్న గోపురాలెన్నో ఉన్నాయి.

గోపురం దాటి, అసలైన ఆలయ స్థానానికి వెళ్లే లోపల మూడు ఆవరణలు ఎదురౌతాయి. మొదటి ఆవరణలో దక్షిణభాగంలో ఒక కొలనుంది. యాత్రికులు ఇక్కడ స్నానం చేసుకుంటారు. కొలను ఒడ్డున సుబ్రహ్మణ్యస్వామి కోవెల ఉంది.

ఒక చిన్న గోపురాన్ని దాటితే, రెండవ ఆవరణలోకి వెళతాం. దీనిలో కూడా దక్షిణభాగంలో మంచి సరస్సుంది. ఇందులో స్నానం చేయనివ్వరు. దీనిని త్రాగేనీటికి ఉపయోగిస్తుంటారు. ఈ ఆవరణలో కొన్ని మండపాలు కూడా కనబడతాయి. వాటిల్లో గణపతి మొదలగు దేవతా విగ్రహాలున్నాయి.

మరొక చిన్న గోపురాన్ని దాటితే మూడవ ఆవరణలోకి చేరుకుంటాము. అందులోనే శ్రీ అరుణాచలేశ్వరుని ఆలయముంది. ఆలయంలో ఐదు ద్వారాల తర్వాత గర్భగుడిలో శివలింగం దర్శనమిస్తుంది. ఈ ఆలయ ప్రదర్శనలో మనకు పార్వతి–గణపతి–నవగ్రహాలు–దక్షిణామూర్తి–శివభక్తగణము–నటరాజస్వామి మొదలగు దేవతల దర్శనం అవుతుంది. శ్రీ అరుణాచలేశ్వరస్వామి ఆలయానికి ఉత్తరంగా పార్వతీదేవి ఆలయముంది.ఆలయం చాలా పెద్దది.ఈ ఆలయంలో చాలా ద్వారాలు దాటితేగానీ, పార్వతీదేవి దర్శనం కాదు. విగ్రహం చాలా భవ్యంగా వుంటుంది.

యాత్రికులు అరుణాచలాన్ని ప్రదక్షిణరూపంలో చుట్టి వస్తుంటారు. పర్వతం చుట్టూ చక్కని ప్రదక్షిణమార్గం ఉంది. కార్తీకపూర్ణిమకు ముందుగా కొన్నిరోజుల నుండి, ప్రతిరోజు పర్వతం పైన ఒక పెద్ద శిలమీద, ఒక పెద్ద పాత్రలో కర్పూరాన్ని రాశిగా పోసి వెలిగిస్తుంటారు. పూర్ణిమ వరకూ వెలిగిస్తూనే వుంటారు. ఆ కర్పూర జ్వాలశిఖనే శంకరుని అగ్నితత్త్వలింగంగా భావిస్తుంటారు. పూర్ణిమరోజు మాత్రం జన సమూహం అసంఖ్యాకంగా వుంటుంది. అందరూ ఆ జ్వాలశిఖను దర్శించుకొని నమస్కరిస్తుంటారు. కర్పూరం వెలిగే శిలమీద చరణ చిహ్నాలున్నాయి.

సుమేరోరపి కైలాసా దప్యసౌ మన్దరాదపి ।
మాననీయో మహర్షీణాం యః స్వయం పరమేశ్వరః ॥



Woman is not beautiful but imagination is beautiful.

స్త్రీ వాస్తవముగ సౌందర్యవతికాదు. ఆమెను గూర్చిన భావనయే సౌందర్యమును సృష్టి చేయుచున్నది.



## సచ్ఛీలమే పరమైశ్వర్యము

'అభయం' అని ప్రారంభించి ఇరువదియాఱు సద్గుణములను పరమాత్మ గీతయందు పేర్కొనెను అవి యేవి యనిన-(1) నిర్భయత్వము (2) అంతఃకరణ శుద్ధి (3) జ్ఞానయోగమునందు నిలకడ (4) దానము (5) ఇంద్రియనిగ్రహము (6) యజ్ఞము (7) అధ్యయనము (8) తపస్సు (9) ఋజుత్వము (10) అహింస (11) సత్యము (12) క్రోధము లేకుండుట (13) త్యాగము (14) శాంతి (15) కొండెములు చెప్పకుండుట (16) సర్వభూతదయ (17) విషయ లోలత్వము లేకుండుట (18) మృదుస్వభావము (19) ధర్మవిరుద్ధ కార్యములందు లజ్జగలిగియుండుట (20) చపలత్వము లేకుండుట (21) బ్రహ్మతేజస్సు (22) ఓర్పు (23) ధైర్యము (24) శుచిత్వము (25) ద్రోహము చేయకుండుట (26) నిరభిమానము.

ఈ ఇరువదియాఱు సుగుణములున్ను జీవుని యంతఃకరణమును పునీతమొనర్చి ఆత్మ సాక్షాత్కారమునకు అనువైన వాతావరణమును కల్పించును. ఇవి కలిగియుండనిచో ఎవరును ఏ కాలమందును ఏ ఇతర ఉపాయములచేతను బ్రహ్మానుభూతినిబొందజాలరు. మనుజునకు ఇవియే భూషణములు. శీలమే జీవునకు అలంకారము. శీలము చెడినచో కోట్లకొలది ప్రాపంచిక విభవములున్నప్పటికిని మనుజునకు కించిత్తైనను విలువయుండదు. సామాన్యులు బాహ్య సౌందర్యమును వీక్షించుదురు. భగవానుడు అభ్యంతర లావణ్యమును పరికించును. అంతఃకరణ నిర్మలత్వమునే వారు కాంక్షించుదురు గాని వేషభాషలను గాదు.

**Character is religion.**

'సచ్ఛీలమే మూడుపాళ్ళమత'మని చెప్పబడినది. అది లేనిచో ఇక మతమునకు నామరూపములే యుండవు. ఒకవేళ ఉండినను కళాకాంతులు ఉండవు. జనులు తమ శీలమునకు, చరిత్రకు ప్రాధాన్యమొసంగక, మతమునందలి బాహ్య ఆచారము లందే పట్టుదల వహించుచు పోయినచో, కొలది కాలమున కా మతము నిర్వీర్యమై

ఈ శరీరమందు శివము, శవము రెండును కలవు. దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము-ఇత్యాది దృశ్యరూప ఉపాధి జడమైనది కాబట్టి శవాకారమని చెప్పబడినది. వీని యన్నిటిని ప్రకాశింపజేయుచు సాక్షి రూపమున వెలుగుచున్నట్టి అంతర్జ్యోతిరూప ఆత్మ 'శివాకార' మనబడును. మనుజుడెంతవఱకు దేహాభిమానము కలిగి శవాకారమగు జడమైన ఉపాధితో తాదాత్మ్యము నొందుచు అదియే తానని భావించుచుండునో అంతవఱకు జననమరణ రూపక్లేశములననుభవించుచుండును. అంతవఱకును అపవిత్రుడై మెలగును. ఎపుడు తాను దేహమునకంటె విలక్షణమైనట్టి శివాకారమగు ఆత్మయని భావించునో అపుడే బంధరాహిత్యమును, కైవల్యమును దుఃఖశాంతిని బొందును. శ్రుతులీసత్యమునే ఉద్ఘోషించుచున్నవి. కావున జనులు దేహభ్రాంతిని త్యజించి, నిజస్వరూపమగు ఆత్మను తెలిసికొనినవారై బంధ విముక్తులగుదురుగాక! ○○

నిస్తేజమై క్షీణించిపోగలదు. ఒకవేళ ఉన్నప్పటికిని లోన చెదలు తొలచివేసి బయటకు ఆకారమాత్రముగ కన్పించు కొయ్యస్తంభముపగిదియుండును. చేవ అంతరించిపోవును. కాబట్టి బాహ్య ఆచార విచారములతోపాటు అంతఃకరణ విశుద్ధత్వముయెడల అతిజాగరూకత కలిగియుండవలెను.

శ్రీకృష్ణపరమాత్మ సచ్చరిత్ర సంపాదనను గీతయందిన్ని పర్యాయములేల ప్రస్తావించవలెను? ఏ అధ్యాయము పరికించినను ఇదే విషయము కానిపించుచున్నదే జీవునకు ఏది అవసరమో అది దేవునకు తెలియును. కనుకనే సాధకులపై కరుణగల్గి తరణోపాయమగు సచ్ఛీలసంపాదనను భగవానుడు గీతయందు పదేపదే ప్రతిపాదించెను. అద్దానిని ఆచరణయందుంచి జనులు పరమశాంతిని బడయుదురుగాక.○○

# ఆధ్యాత్మిక కథలు

ఒకానొక రాజ్యమున ఒక పట్టణము కలదు. ఆ పట్టణములోని ప్రజలు ధనధాన్యములతో తులతూగుచు సుఖముగ జీవించుచుండిరి. కొన్ని దినములకు వారికి ఒక సమస్య ఏర్పడినది. ప్రక్కనే గల ఒక అరణ్యములో గల ముగ్గురు బందిపోటు దొంగలు రాత్రివేళలందు ఆ ఊరిలో ప్రవేశించి జనులను బాధించి వారివద్ద గల నగలను, ధనమును దోచుకొని పోవుచు పట్టణములో అలజడి రేకెత్తించిరి. ఏ దినమున ఎవరి ఇంటికి దొంగలు వచ్చి తమ సంపదను కొల్లగొట్టుకొనిపోవుదురేమోనని ఆ పట్టణవాసులు భయభ్రాంతులతో రాత్రిళ్ళు గడపసాగిరి.

ఆ దేశపు రాజు మరియు పట్టణమందలి ఉన్నతాధికారులు ఆ బందిపోటు దొంగలను పట్టుకొనుటకు ఎన్నియో ఉపాయములను పన్నిరి, కాని దొంగలు వారికి చిక్కకుండ తప్పించుకొని పారిపోవుచుండిరి. ఎట్టకేలకు రాజు, ఆ దొంగలను పట్టించి ఇచ్చినవారికి చక్కటి బహుమానమును ఒసంగగలనని తన రాజ్యములో దండోరా వేయించెను. దొంగల భీతి వలన ఆ పట్టణవాసులకు మనశ్శాంతి కరువయ్యెను.

ఒకనాటి రాత్రి ఆ ముగ్గురు బందిపోటు దొంగలు యథాప్రకారముగ పట్టణములో ప్రవేశించి కొందరు సంపన్నుల గృహములలోని ధనపేటికలను కొల్లగొట్టి ఆ సంపదనంతటిని మూటగట్టుకొని అరణ్యమునకు తిరిగివచ్చిరి. రాత్రి గడచిపోయి తెల్లవారుచుండగ వారికి తీవ్రముగ ఆకలి కాసాగెను.

అందులో ఒకడు మిగతా ఇద్దరితో ఇట్లు పలికెను– "ఓ మిత్రులారా! మనకిపుడు బాగుగ ఆకలివేయుచున్నది. ఈ సమయమున కొల్లగొట్టిన

ధనమును పంచుకొనుటకంటె, ఎచటనయినను ఆహారమును సంపాదించి, దానిని భుజించిన పిదప తీరికగ దానిని పంచుకొనవచ్చును"

అది విని మిగిలిన ఆ ఇద్దరు దొంగలు, "ఓయీ! అటులయిన నీవే ఎచటికైనా వెడలి ఆహారమును కొనిరమ్ము. అంతవరకు మేమిరువురము ఈ ధనము యొక్క మూటను జాగ్రత్తగ కాపాడుచుందుము. నీవు తిరిగి వచ్చిన పిదప దానిని పంచుకొనెదము" అని తెలుపగా మొదటి దొంగ ఆహారమును తెచ్చుటకై వెడలెను. అతడు నిష్క్రమించిన పిమ్మట ఆ ఇరువురు దొంగలకు ఒక దుర్బుద్ధి కలిగెను. మొదటి దొంగ ఆహారమును తీసుకొని రాగానే చాటున నిలబడి అతనిని వధించినచో, దోచిన సొమ్మంతటిని తాము ఇరువురమే పంచుకొనవచ్చునని వారు తలంచిరి.

మొదటి దొంగ మారువేషములో ప్రక్క గ్రామములోనికి పోయి కొంత ఆహారమును సంపాదించుకొని తిరిగివచ్చుచుండగా, అతనికి ఒక దుస్సంకల్పము కలిగెను. "ఈ ఆహారములో విషము కలిపి, వారిరువురుకు ఒసంగెదను. వారిని నిర్మూలించుకొనినచో ఆ సొత్తు అంతయు నా ఒక్కనికే దక్కును" అని ఆలోచించుచు, మొదటి దొంగ విషాహారమునుతెచ్చి వారికివ్వబోయెను. ఇంతలో ఆ ఇద్దరు దొంగలు అకస్మాత్తుగ మొదటివానిపై దాడిచేసి, వానిని వధించి, తమ పథకము ఫలించినదని సంతోషించసాగిరి. మొదటి దొంగ తీసుకొని వచ్చినది విషపూరితాహారము అని తెలియక వారు దానిని భుజించిరి. విషప్రభావమువలన వారు కూడ దుర్మరణముపాలైరి.

నీతి : మానవుడా! తోటివారిని నీవలె ప్రేమించుము. ఒకరిని చెడగొట్టవలెనను తలంపు తనకే ముప్పు కలిగించును. కావున జనులు సత్సంకల్పములు, సద్భావనలు, పరోపకారస్వభావమును అలవరచుకొనవలెను. ఈర్ష్య, ద్వేషము, అపకారబుద్ధి మొదలగు దుర్గుణములకు ఏనాటికిని హృదయములో చోటీయరాదు. దుష్టభావములు, దుస్సంస్కారములు ఏవైన మనస్సులో ఉన్నచో వాటిని ప్రయత్నపూర్వకముగ తొలగించుకొని, సచ్చరిత్రను కలిగియుండి, చిత్తశుద్ధిని బడసి మనుజులు పరమాత్మను సాక్షాత్కరింప జేసుకొనవలెను. అత్తఱి జనులు పరిపూర్ణశాంతిసుఖములను అనుభవించగలరు.

○○

# సద్గురు సుభాషితములు

## శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

1 కొద్దిగ మండుచుండు పొయ్యిలో కొన్ని యెండు కట్టెలు వేసిన యేలాగున బాగుగ ప్రజ్వరిలించునో, అట్లుగాక కొంచెముగా వెలుగుచుండు పొయ్యిలో కొన్ని పచ్చికట్టెలు వేసిన మండే నిప్పుగూడ యేలాగున నారిపోవునో, యాలాగున కొద్ది జ్ఞానముగలవారు మంచి విరక్తియు, బ్రహ్మనిష్ఠయుగలవారి సహవాసము జేసిన జ్ఞానము మిక్కిలి ప్రకాశించును. అట్లుగాక విషయాసక్తులగు వారి మధ్య యుండిన, ఇదివరలో యుండిన జ్ఞానముగూడ లోపించిపోవును.

2. సోమరుల యొక్కయు, సోహంపరుల యొక్కయు స్వభావము ఈ క్రింది విధముగా గనందగును. సోమరులు ఒక్కరు చేయందగిన పనిని, నలుగురు గుమికూడి చేయుదురు. దానినిన్ని విసుగుతోనే చేయుదురు. అంతేగాక ఒక్క రోజులో పూర్తిచేయందగిన పనిని నాలుగు రోజులలో గూడ పూర్తిచేయక కొంచెమైనను మిగిలింతురు. అదియున్ను శుద్ధముగా చేయక మరల ఇతరులచే సంస్కరింపబడవలసియుండును. అట్లు సోమరులు కానివారును, సుధీరులును అగువారు నలుగురి పనిని ఒకరే సంతోషముతో చేయగలరని తెలుపును. ఆలాగున నాలుగు రోజులలో పూర్తియగు పనిని ఒక్క రోజులో పూర్తిచేసేలాగున తలంచును. ఆలాగున చెప్పును. చేయు యత్నమును గూడ నవలంబించును. అదియును చూచువారందరు ఆశ్చర్యముపడేలాగున శుద్ధముగా చేయును. ఈ యొక్క దాని వలననే జీవుల గుణాగుణముల తెలిసికొనవచ్చును.

3 సామాన్య మనుజుల జీవితము కోతికి దొరికిన టెంకాయవంటిదే యగును. దానిని పగులగొట్టి దానియందుగల గొబ్బరిగాని, నీరుగాని భుజించుటకు దానికి సాధ్యముగాదు. ఆ పీచుతోగూడిన కొబ్బరికాయ నొక మానవునికి దొరకినచో, పగులగొట్టి దానిలోగల కొబ్బరియు నీరును భుజించునట్లుండును. వివేకముగల వానికి లభించిన మానుషజన్మముయొక్క అంతరమున వెలుగుచుండు,

అమృతత్వమును భుజించి ఆత్మతృప్తినిబొందగలుగును. ముక్తి సుఖమును నొందును.

ఆహార నియమములేని సాధకుల స్థితి యెట్లుండునన, పొలములో ఎరువు అధికరించి మిక్కిలి పెరిగిన అనగా మదించిన పైరున్ను, ఆలాగున ఎక్కువ సత్తువచే పెరిగిన కూరగాయల చెట్లున్ను, సరిగా పండకపోవునో, దీనిని చూచుకొనిన చాలును. ఆలాగున ఆహారనియమములేని సాధువుల యొక్క స్థితియుండునని గ్రహించేది. ఇట్టివారికి ఇన్ద్రియనిగ్రహముగాని చిత్తైకాగ్రతగాని యుండనందుచే, ఆత్మజ్ఞానముగూడ తరిగిపోవును. కావున ఆహారనియమములలో మిక్కిలి జాగ్రత్త గలిగియుండుట క్షేమకరము. పైరున్ను కూరగాయల చెట్లున్ను, బాగుగా బలిసియున్నట్లు వీరి దేహేన్ద్రియాదులు మంచి సౌష్ఠవమును గలిగియుండునేగాని జ్ఞానఫలము సరిగా యుండదు.

అయితే మితముగా యెరువున్ను నీళ్లున్ను ఎండయుగల సస్యములు బాగుగా పండునట్లు ఇట్టి బ్రహ్మనిష్ఠులకు ఇన్ద్రియనిగ్రహము మనశ్శాన్తియు సదా ప్రసన్నతయు ఆవరణముగలుగని జ్ఞానమున్ను, ఎల్లప్పుడును యుండును.

5 ప్రభుత్వమునకు ప్రీతికరమగు కార్యములను చేయుటలో ప్రభువునకును ఉద్యోగస్థులకున్ను యేలాగున ప్రీతిగలిగి అన్ని విధములుగా ధన, జన, సహాయముల నొనర్చెదరో, ఆలాగున దైవప్రీతికర కార్యములను చేయువారికి దైవమున్ను దైవ జ్ఞానముగల ఋషులున్ను తప్పక సహాయము చేయుదురు. ప్రభుత్వమున కనుకూలము చేయుటలో ప్రజలకుగదా సౌఖ్యము గలుగును. ఆలాగున దైవప్రీతికరము చేయువారు ప్రజోపయోగమును గూడ చూడవలయును. అయితే దైవప్రీతికరమగు పనులను చేయుచున్నానని చెప్పుచు స్వార్థముకొరకైనచో ఎట్లు శిక్షింపబడునో, ఆలాగున దైవప్రీతికరమగు పనియని చెప్పుచు స్వార్థము కొరకైనచో దైవముచే శిక్షితుడగునని మరువకూడదు. ఇదియున్ను దైవకార్యము జేయువారు తప్పక మనస్సులో నుంచదగినది.

**భగవంతుని భజింపనిచో వారి అనుగ్రహము లభింపదు.**
**వారి అనుగ్రహము లేనిచో జ్ఞానదీపము దొఱకదు.**
**జ్ఞానదీపము లేనిచో అజ్ఞానాంధకారము నశించదు.**
**అజ్ఞానాంధకారము తొలగనిచో దుఃఖ మంతరింపదు.**

# [illegible]

**ఈశ్వర్**

నేటి మానవునికి లెక్కించనలవికాని రోగములు వచ్చుచున్నవి. రోగాల సంఖ్యతో పాటు డాక్టర్ల సంఖ్య, మందులషాపుల సంఖ్య, మందుల సంఖ్య పోటాపోటీగా పెరుగుచున్నవి.

పూర్వకాలములో ప్రయాణ సౌకర్యములు లేని రోజులలో 30 గ్రామాలకు కూడా ఒక వైద్యుడు కనుపించేవాడుకాదు. అప్పుడు ఇన్ని రకాల మందులు, యంత్ర పరికరాలు లేవు అయినను వారు అత్యధిక ఆరోగ్యంగాను, ఆనందంగాను జీవించెడివారు.

ప్రస్తుత పరిస్థితులు వేరు. యంత్రయుగములో యున్నాము. కడుపునొప్పి, కాలునొప్పి, పంటినొప్పి ఏ నొప్పికయినా ఎక్స్‌రే (X-Ray)పైన ఆధారపడవలసినదే. ఎముకలు విరిగితే భగవంతుడి వరప్రసాదంగా సృష్టిలో దొరకు సామాన్యమైన ఒక రకమైన ఆకురసం వాడితే ఎముకలు కలుసుకొనే సదుపాయమున్నను వాటిని ఎంతమంది విశ్వసించుచున్నారు, ఉపయోగించుకొనుచున్నారు ప్రతిదానికి కంగారు, తలనొప్పివస్తే కంగారు, కడుపునొప్పి వస్తే కంగారు, కండ్లు మంటలుపుడితే కంగారు, ఆకలి లేకపోతే కంగారు ప్రతిదానికి తాను కంగారుపడి అందరిని కంగారు పట్టిస్తుంటారు చాలామంది. ప్రతిచిన్నదానికి డాక్టరును కలవాలి. మాత్రలు రాసిస్తారనుకోండి తృప్తి వుండదు. ఇంజక్షన్ ఇవ్వరేం డాక్టరుగారు అని డాక్టరును వేధిస్తారు.

ఇలా మందులు వాడుట ఫాషనైపోయింది. మందులు అవసరములేదు. ఆహారములో మార్పుచేసి చూడండని పాతకాలపు వైద్యులు చెపితే ఈ డాక్టరుకు ఏమీ తెలియదని, చాదస్తమని అతనివద్దకు పోవుట మానేస్తారు. ఇది ఈ కాలపు కొందరి మనుష్యుల మనస్తత్వాలు.

అసలు రోగమెందుకు వస్తుందో ఒక నిమిషం ఆలోచిస్తాం! జీర్ణకోశము కూడా ఒక రకమైన మిషనే. ఈ మిషనును జాగ్రత్తగా వాడుకొనుటకు అలవాటు పడాలి. కనుపించిన తిండినల్లా తినేవారు కొందరైతే, మరికొందరు పోటీపడి కారము, ఉప్పు-పులుపు అమితంగా వాడుతుంటారు. బెడ్‌కాఫీతో ప్రారంభించి గంటగంటకు

ఏదో ఒకటి నమిలే స్వభావముగలవారు కొందరు లేకపోలేదు.

పొగ త్రాగరాదని ఎంత చెప్పిన వినేవారున్నారా? పొగ త్రాగుటలేదు బయటికి వదిలేస్తున్నానని చెప్పేవారు కూడ కొందరున్నారు. మద్యపానం మానవుని రాక్షసునిగా చేస్తుందని తెలియదా? తెలుసు మరి మానుకొంటున్నారా? ఈ విధంగా అనారోగ్యమును గురించి శ్రద్ధ కనుపరిచేవారి సంఖ్య ఎక్కువగా వుందేకాని, ఆరోగ్య మును గురించి శ్రద్ధ తీసుకొనువారి సంఖ్య చాల తక్కువ. ఈ శరీరమను మానవ యంత్రమునకు దేశకాల పరిస్థితులనుబట్టి, వాతావరణ మార్పులనుబట్టి, శరీర తత్వాన్నిబట్టి అప్పుడప్పుడు అనారోగ్యము కలుగుట సహజమే. చాలామటుకు జబ్బులకు మనము మన ఇంటిలో దొరకు సామాన్య వస్తువులతో వైద్యము చేసి కొని ఆరోగ్యాన్ని పొందవచ్చును. ప్రస్తుతం ఇచ్చట కొన్ని తెలుసుకుందాం!

### తలనొప్పికి

తెల్ల వెల్లుల్లిపాయనుగాని లేక ఆవాలుగాని తీసుకొని బాగా నూరి నొప్పి వున్నచోట పట్టువేసిన మరుక్షణం గుణం కనిపించగలదు.

### అమిత దాహం

ఎండాకాలములో దాహం తీర్చుకొనుటకుగాను రకరకాల డ్రింక్స్ త్రాగుటకంటే నిమ్మకాయ రసంతో సోడా కలుపుకొని త్రాగిన దాహము తీరును. ఈ విషయము చాలామందికి తెలిసినను ప్రాముఖ్యత ఇవ్వరు. ఎక్కువగా ఖర్చుచేసి ఏదో ఒక డ్రింక్ త్రాగితేగాని వారికి తృప్తి అనుపించదు. ఇది కొందరికి సహజమైన అలవాటు.

ఆరోగ్యసూత్రాలు పాటించి అనారోగ్యాన్ని అంతం చేయుటకు ప్రయత్నించి సత్ఫలితాలు పొందుదాం! OO

**Heaven is within you. Seek happiness not in the objects of senses. Realise that happiness is within yourself.**

**స్వర్గము, మోక్షము నీయందే యున్నవి. సుఖమునకై దృశ్య పదార్థములందు వెతకకుము. పరిపూర్ణసుఖము నీయందే యున్నదని బాగుగ తెలిసికొనుము. ఆ ప్రకారము అనుభవించుము.**



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

ఉత్తరాపాండవమను రాజ్యముగలదు. హరిశ్చంద్రుని కులమందు జనించిన లవణుడను ధర్మాత్ముడైన రాజు దానిని బాలించుచుండెను. ఒకనాడాతడు మంత్రుల తోను సామంతులతోను ఇతర సభాసదులతోను గూడి కొలువుతీర్చియుండ నచ్చోటికొక ఐంద్రజాలికుఁడు (గారడివాడు) వచ్చి రాజుతో మీరొక ఆశ్చర్యప్రదమగు కౌతుకమును ఈ సింహాసనముపై నుండియే వీక్షింపుడని పలికి తన చేతియందలి నెమలి యీకను రాజుముందు త్రిప్పెను. ఆ క్షణముననే యొకడొక గుఱ్ఱమునటకు గొనివచ్చి రాజుతో 'మా ప్రభువిద్దానిని తమకొఱకు పంపె'నని చెప్పెను.

అపుడు ఐంద్రజాలికుడు రాజుతో ఆ గుఱ్ఱమునెక్కి విహరింపుడని చెప్ప రాజా గుఱ్ఱమును జూచి కనుమూసికొని నాలుగు ఘడియలట్లే యా సింహాసనమున నిశ్చలముగ నుండెను. అది గాంచి సభాసదులెల్లరు ఆశ్చర్యమగ్నులై, నిశ్చేష్టితులై యుండిరి. నాలుగు ఘడియలైన వెనుక రాజు మేల్కొని సింహాసనముపై నుండి పడుచుండ ఎదుటనున్నవారు పట్టుకొనిరి. అపుడు మంత్ర్యాదులు రాజును భ్రమకారణ మడుగ రాజు సభాసదు లందఱితోను నాలుగు ఘడియలలో జరిగిన తన వృత్తాంత మంతయు నిట్లు వర్ణించి చెప్పెను-

ఐంద్రజాలికుఁడు నా యెదుట నెమలియీకను ద్రిప్పిన పిదప నేను భ్రమ యందు నా యెదుటనున్న యీ గుఱ్ఱమునెక్కి వేటకు బోవ ఒక విశాలమైన యర ణ్యము కానవచ్చెను. నేనట్లే దప్పికతో బోవుచుండ నింకొక యరణ్యము కానుపింప నట నొక లతను బట్టుకొనగా, నా క్రిందనున్న గుఱ్ఱము ఎటకో సాగిపోయెను. ఇం తలో సాయం సమయము కాగా నేనా రాత్రి యా మిక్కుటమైన చలిలో నటనే అతి దుఃఖముతో గడిపి ప్రాతఃకాలమున ఆ యరణ్యమున దిరుగాడుచుండనింతలో నట చాండాలకన్య ఒక పాత్రయందు అన్నమును గొనిపోవుచుండుటను జూచి ఆమెను

కొంత అన్నము పెట్టుమని వేడుకొనినను ఆమె యది యాతనికి తగిన ఆహారము కాదని నిరాకరించి పోవుచుండ నేనామె వెనువెంటనే పోవుచు ప్రాధేయపడగా తుద కామె 'నీవు నా పతివైనచో అన్నమిత్తు' నని చెప్ప ఆతఁడందులకంగీకరించెను.

అపుడా పాత్రలోని యన్నములో సగము భాగము నాకివ్వ, దానిని నేను భుజించి నేరేడుపండ్ల రసమును త్రావి అట కొంతసేపు విశ్రమించితిని. పిదప ఆ స్త్రీ పొలమును దున్నుచున్న తన తండ్రికి మిగిలిన ఆ అన్నమునిచ్చి వివాహమునుగూర్చిన తన సంకల్పము నాతనికి నెఱింగింప,ఆతడు సమ్మతించెను. అపుడు సాయంసమయ మున మేము ముగ్గురము చాండాలవాటికకు వచ్చితిమి. అచట మాంసాదులతోను, ఈగలతోను ఆ ప్రదేశము చాల యశుభ్రముగ నుండెను. తదుపరి ఒకానొక శుభదిన మున ఆ చండాలురందరు వైభవముగ ఆ స్త్రీతోటి నాకు వివాహము చేసిరి.

కాలక్రమమున నాకు పలువురు కుమారులు, కుమార్తెలు కలిగిరి, కుటుంబ భారమధికమయ్యెను. ఆ కుటుంబ పాలనకై నేను పడరానిపాట్లు పడితిని. ఎన్నియో ఇక్కట్లనుభవించితిని. గ్రామవాసులతోను తదితరులతోను అనేక కలహములు సంభ వించెను. ఇట్లు బహు దుఃఖముతో నా జీవితము గడచెను. ఇంతలో నేను వృద్ధుడ నైతిని. నేనున్న యా ప్రదేశమున గొప్ప దుర్భిక్షము సంభవించెను. అనేకులు తిండి లేక మరణించిరి. కొందఱా ప్రదేశమును వీడి ఇతరచోట్లకుఁ బోయిరి. నేనున్ను అటనుండి నా కుటుంబమును మితముగ వెంటనిడుకొని బయలుదేఱితిని.

త్రోవలో నొక వృక్షముక్రింద విశ్రమించితిని. నా భార్య నిదురింప నా కడగొట్టు కుమారుడు ఆకలిబాధకు తాళజాలక మాంసమిమ్మని నన్ను చాల పోరు పెట్టెను. ఆతని యాబాధ చూడజాలక నేను మరణింప నిశ్చయించి, అట కట్టెలను పేర్చి అగ్ని రగుల్కొలిపి అందు దూకుచుండ, ఇచట ఈ సింహాసనము నుండి పడబోవ అపుడు తూర్య జయ జయ నాదములచే నేను మేల్కొనబడితిని. ఈ ప్రకారముగ ఇంద్రజాలికుడు నాకు భ్రమను గొలిపెను-అని రాజు వచింప అపుడా ఇంద్రజాలికుఁడంతర్ధానమయ్యెను.అది గాంచి సభాసదులు రాజుతో 'ఈతడింద్రజాలి కుఁడు కాదు, అయియుండినచో ధనమును వాంఛించి యుండెడివాడు. ఈతడేదియో దైవీ మాయయై యుండనోపు' అని చెప్పిరి.

ఓ రామచంద్రా! ఆ సమయమున నేనున్ను ఆ సభయందుంటిని. కావున ఈ వృత్తాంతము నపుడు నేను కన్నారచూచితినే గాని ఒకరి వలన వినినది కాదు. ఈ ప్రకారము జగద్వైచిత్ర్యము చిత్తము వలననే కలిగినదని యెఱుంగుము.

మనోవృత్తులే సంసారమను విషవృక్షమునకు ఉత్పత్తి స్థానము భోగవాసనా సంక్షయముద్వారా వానిని నిగ్రహించుట ద్వారా మనస్సును సంయమమొనర్చినచో సంసారభ్రమ శమించి ఆత్మప్రాప్తియను మోక్షము లభించును. ○○

# సృష్టిలో వింతలు - విశేషాలు

1. సూర్యుని చుట్టూ తిరుగు గ్రహములలో నాలుగవది అంగారకుడు (కుజుడు). అది సూర్యుని నుండి 14 కోట్ల మైళ్ళ దూరమున గలదు. ఇది ఎర్రని కాంతితో ప్రకాశించును. దీని చుట్టూ రెండు ఉపగ్రహములు తిరుగుచుండును.

ఆస్ట్రేలియా ఖండములోని 'బుల్ డాగ్' అను చీమను రెండు భాగములుగ చేయబడినను ఆ రెండు సగభాగములు పోట్లాడు కొనును.

3. రెండు అడుగుల ఎత్తుగల చీమల పుట్టలో 90 వేల చీమలు నివసించును.

4. చీమలలో 15 వేల జాతులు కనుగొనబడినవి.

5. పసిఫిక్ మహాసముద్రములో ఆల్గే జాతికి చెందిన 'పేరుకెల్ప్' అను మొక్క చాల పొడవైనది. దాని పొడవు 196 అడుగులు.

6. చైనాలోని హాంగ్‌కాంగ్ పట్టణములో జనసాంద్రత చాలా ఎక్కువ. అక్కడ చదరపు మైలునకు 2 లక్షలమంది జీవించు చున్నారు.

7. అమెరికా దేశస్థురాలు ఎలినార్ రిచ్చీ 1973 సంవత్సరంలో తన 12 కోట్ల రూపాయల ఆస్తిని తన 150 పెంపుడు కోళ్ళకు చెందులాగున వీలునామా వ్రాసెను. OO



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము-వాసనాక్షయము

**శిష్యుడు (శివప్రసాద్)**- మహాత్మా! గురుదేవా! సంసారబంధం నుండి తప్పించుకొనుటకు ముఖ్యమైన సాధనలు మూడు యున్నాయని తామిదివరలో సెలవిచ్చి వాటి పేర్లు కూడ చెప్పియున్నారు. ఆ మూడు సాధనలను గూర్చి నేను విపులంగ తెలుసుకోదలచాను. మానవుడు తరించటానికి ఆ మూడున్నూ కీలకమైన సాధనలు కాబట్టి వాటియొక్క వివరములు తమ ముఖతః తెలుసుకొని ఆచరించి పవిత్రమైన ఈ మానవజన్మను సార్థకం చేసుకోదలంచాను. ఆ మూడు సాధనలలో మొదటిదైన తత్త్వజ్ఞానమును గూర్చి ఇదివరలో తమరు సెలవిచ్చియున్నారు. ఇపుడు రెండవదైన వాసనాక్షయమును గూర్చి తెలియజేయ ప్రార్థన.

**గురువు (ప్రబోధానందజీమహరాజ్)**- నాయనా! శివప్రసాద్! ఆధ్యాత్మిక సాధనలను తెలుసుకొనుటకై తీవ్రమైన జిజ్ఞాస కలిగియున్న నీవు ధన్యుడవు. పరమార్థభావాలను గ్రహించి వాటిని ఆచరణయందుంచి తరించవలెనను కుతూహలము అందరికి కలుగదు. పూర్వజన్మ పుణ్యసంస్కారము గలవారికి మాత్రమే అట్టి ఉత్కంఠ కలుగుతూంటుంది. ఆధ్యాత్మిక సాధనలలో ప్రముఖమైన మూడిటిలో రెండవదియగువాసనాక్షయమును గూర్చి ఇపుడు చెప్పుచున్నాను, విను.

ఏదైన ఒక పనిని అది శుభముగాని, అశుభముగాని మరల మరల ఆచరిస్తుంటే అది ఒక సంస్కారరూపంగ పరిణమించి హృదయంలో రూఢీపడిపోతుంది. దానినే'వాసన' అంటారు. అది శుభవాసన అని, అశుభవాసన అని రెండు రకాలుగా యుంటుంది. సద్గుణాలకు, సచ్చరిత్రకు, సత్స్వభావానికి సంబంధించినది 'శుభవాసన'. దీనినే 'దైవీసంపత్తి' అని కూడ అంటారు. దుర్గుణాలు, దుస్స్వభావాలు మనస్సునందుంటే వాటిని 'అశుభవాసనలు' అంటారు. వాటినే 'అసురసంపత్తి' అని కూడ పిలుస్తారు. అలవాటు బలపడితే వాసనగ పరిణమిస్తుంది. పదేపదే ఆచరించటంవల్ల

వాసన దృఢపడిపోతుంది. వాసన వలన పూర్వాపర విచారణ లేకయే ఆయా పనులను మనుజుడు చేస్తూంటాడు.

ఒక నది చీలి రెండుగా ప్రవహించునట్లు మనస్సు శుభవాసనా మార్గముగాను, అశుభవాసనామార్గముగాను రెండు విధాలుగా ప్రవర్తిస్తూంటుంది. వివేకం గలవాడు వైరాగ్యాదుల సహాయంచే అశుభవాసనలను పోగొట్టుకొని మనస్సు యొక్క ఆ శక్తిని శుభవాసనామార్గంలోకి ప్రవేశపెడ్తాడు. అపుడా శుభమార్గాన మనస్సు ద్విగుణీకృత ఉత్సాహంతో, ద్విగుణీకృత శక్తితో పనిచేస్తుంది.

మానవుని హృదయాన్ని సద్గుణాలతో నింపివేస్తుంది. కామము, క్రోధము, లోభము మొదలైన అసురగుణాలు తొలగిపోయి శమదమాది సద్గుణాలు, భక్తిజ్ఞాన వైరాగ్యములు, ప్రేమ, దయ, కరుణ, ఉపకారం మొదలైన ఉదాత్తగుణాలు ఆ సమయంలో హృదయంలో వచ్చి చేర్తాయి. అపుడు జీవునకెంతయో ప్రశాంతి, ఆనందం కలుగుతూంటాయి.

సాధకుడు మొట్టమొదట తనలోని అశుభవాసనలను ఏరిపారవేయాలి. వివేక వైరాగ్యజ్ఞానాదుల ద్వారా వాటిని రూపుమాపాలి. శుద్ధవాసనలు కలుగజేసు కోవాలి. క్రమంగ వాటిని కూడ దాటిపోయి నిర్వాసనాస్థితిని పొందాలి. అదియే ఆత్మస్థితి. అట్టి నిర్వాసనాస్థితియందే స్వస్వరూప సాక్షాత్కారం, ఆత్మానుభూతి కలుగుతూంటాయి.

కాబట్టి శివప్రసాద్! నీవు జపతపాది సాధనలతోపాటు హృదయ పరిశోధన కూడ గావిస్తూండు. హృదయాన్ని లెస్సగ పరిశోధించి జన్మాంతర దుస్సంస్కారాలను తొలగించివేయి. ప్రయత్నపూర్వకంగ సద్వాసనలను అవలంబించు. క్రమంగ వాటిని కూడ దాటిపోయి ఆత్మయందు నిలకడ కలిగి నిరతిశయానందాన్ని అను భవించు. జన్మను తరింపజేసుకో.

**శిష్యుడు** –గురుదేవా! ఇదివరకు నాకేమీ తెలియని విషయాన్ని తమరు విశదీకరించి చెప్పినారు. నా హృదయం ఆనందంతో ఉప్పొంగుతుంది. వాసనాక్షయమను సాధనను ఎట్లు ఆచరించవలెనో తమరు చక్కగ సెలవిచ్చియున్నారు. తాము బోధించిన ప్రకారమే నేను ఆ సాధనను అమలులో పెట్టి సత్ఫలితాలను అనుభవింప దలచాను. దేనికైనా తమ కటాక్షం యుండాలి. దైవకృప చేతను, గురుకటాక్షము చేతను, స్వప్రయత్నం చేతను మహత్తర కార్యాలు సాధింపబడ్తూంటాయి. మహాత్మా! అనుగ్రహించండి. సెలవు. ○○

నిమ్మ చెట్టు వాడిపోయినపుడు దానికి నీరు పోసినచో అది తిరిగి చిగుర్చును. క్రమముగ వృద్ధియగును.

అదే రీతిగ క్షీణించిన అహంకారమునకు విషయానుభవము, దృశ్యసేవనము కలిగినచో అది తిరిగి విజృంభించి పారమార్థిక సాధకునకు అధోగతి కలిగించును.

కాబట్టి ముముక్షువులు అల్పములగు ఇంద్రియసుఖములకై అఱ్ఱులు చాచక, జితేంద్రియులై, యమనియమాదిసాధనాపరులై అహంకారమును సమూలముగ తొలగించి కేవలానందస్వరూపులై, చిద్రూపులై, జీవన్ముక్తులై విరాజిల్లవలెను.

2) [illegible]

ధ్యాయస్స్వ ధాలిం హ్యలిభావమ్ముచ్ఛ్రుతి
తథైవ యోగీ పరమాత్మ తత్త్వం
ధ్యాత్వా సమాయాతి తదేకనిష్ఠయా

కీటకము (పురుగు) ఇతర విషయములను ఏ మాత్రము చింతించక నిరంతరము కేవలము తుమ్మెదను గురించియే ఆలోచించుచుండును. తదేకచింతన వలన ఆ పురుగు తుమ్మెదగ పరిణమించుచున్నది.

అట్లే మనుజుడు నిరంతరము దైవచింతన, భగవద్ధ్యానము సలుపుచు, మహత్తరమైన దైవానుభూతిని బడసి మోక్షస్వరూపుడై విలసిల్లుచున్నాడు. జనన మరణ రహితమైన బ్రహ్మపదమును చేరి ఆత్యంతిక సుఖశాంతులను అనుభవించుచున్నాడు.

కావున ఓ ముముక్షువులారా! మీరున్ను ప్రాపంచిక సంకల్పములన్నిటిని త్యజించి దైవ, ధ్యాననిష్ఠచే, అనన్యభక్తిచే మోక్షస్వరూపులై చెన్నొందుడు. ○○



## శ్రీ పోలూరు కృష్ణమూర్తి గారు (పోలూరు)

పాడండి పాడండి రామనామము
పాపముల పార(ద్రోలు రామనామము ।పా।

1. కలికాల దోషములను రామనామము
చిటికెలోన హరియించు రామనామము ।పా।
2. చిరస్మరణీయంబు రామనామము
భుక్తి, ముక్తులనిచ్చు రామనామము ।పా।
3. సకలార్థసాధకంబు రామనామము
సారమెరిగి పఠించుడీ రామనామము ।పా।
4. మారుతి జపియించు రామనామము
మరల మరల పలకండి రామనామము ।పా।
5. పరమేష్ఠి పఠియించె రామనామము
పార్వతికుపదేశించె రామనామము ।పా।
6. త్యాగరాజు గానంచేసే రామనామము
రామదాసు కీర్తించె రామనామము ।పా।
7. జన్మరాహిత్యమిచ్చు రామనామము
జనులార చేయండి రామనామము ।పా।
8 ఉపనిషత్సారమండి రామనామము
ఉద్ధరించు మనలను రామనామము ।పా।
9. జిహ్వాగ్రమున నిల్పు రామనామము
భక్తవరుల బ్రోచు రామనామము ।పా।
10 నరజన్మ దుర్లభంబు రామనామము
నోరార పలుకుము రామనామము ।పా।
11. భద్రాద్రి రాముని దివ్యనామము
భక్తిమీర జేయండి రామనామము ।పా।

# గ్రంథ సమీక్ష

## వేదాంత పంచదశి

ఆధ్యాత్మిక వాఙ్మయమునందు 'వేదాంత పంచదశి' ఒక మహోన్నతమైన గ్రంథరాజము. శ్రీ విద్యారణ్యస్వామివారు ఈ గ్రంథమును రచించిరి. ఈ గ్రంధము మద్రాసు మైలాపూర్ నందు గల శ్రీరామకృష్ణ మఠము వారిచే ప్రకటింపబడినది. ఇందు మూల శ్లోకములు, తెలుగు తాత్పర్యము కూడ గలదు. మానవుడు తరించుటకు వలసిన ఎన్నియో ఆధ్యాత్మిక సాధనలు ఇందు చక్కగా వివరింపబడినవి. ముముక్షువులకిది అత్యావశ్యకమైన గ్రంథము.

**రచయిత : శ్రీ విద్యారణ్యస్వామివారు**

**ప్రాప్తి స్థానము : శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు–600 004**

**పుటలు–415, వెల : రూ.40/–**

## శ్రీ వివేకానంద సాహిత్య సర్వస్వము

### 10 సంపుటములు

ఈ మహోన్నత గ్రంథమును కూడా పైన తెలిపిన శ్రీరామకృష్ణ మఠము వారే ప్రచురించినారు. శ్రీ వివేకానందస్వామి వారి యొక్క గంభీరములైన బోధనలు, వారి జీవిత విశేషములు, ముముక్షువులకు వారొసంగిన చక్కని ఉపదేశములు ఈ గ్రంథమునందు బాగుగ వివరింపబడినవి. సాధకలోకమునకు ఈ గ్రంథమెంతయో ఉపకరించగలదు. పై అడ్రసువారికి వ్రాసి వివరములు తెలుసుకొనవచ్చును.

## శ్రీ సీతారామాంజనేయ సంవాదము

శ్రీ రామచంద్రుడు, శ్రీ సీతాదేవి హనుమంతునకు బోధించిన దివ్యమైన పరమార్థబోధలు తెలుగు పద్యరూపమున ఈ గ్రంథమునందు గలవు. ప్రతి పద్యమునకు తెలుగు తాత్పర్యముకూడా గలదు. భాష సులభముగ వున్నందువలన ప్రతి

వారును ఆధ్యాత్మిక తత్త్వములను చక్కగ గ్రహించి ఆచరణయందుంచుటకు వీలు పడుచున్నది. పరమార్థ వాఙ్మయమున శ్రీ సీతారామాంజనేయ సంవాదమునకు ఎంతయో ప్రాముఖ్యత కలదు. బ్రహ్మవిద్యను తెలుసుకొనగోరువారికి ఈ గ్రంథము బాగుగ సహాయపడగలదు.

కృతికర్త– శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి గారు
తాత్పర్యకర్త– శ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మ గారు
వ్యాఖ్యాత– శ్రీ వేదాంతం లక్ష్మయ్య సద్గురువులు గారు
ప్రాప్తిస్థానము– బ్రహ్మస్పర్శిని ప్రచురణలు
21/303, మురుగేశం కాంపౌండు, కడప–516 001
**పుటలు–670, వెల : రూ.80/–**

## ఉపనిషత్కథలు

వేదవాఙ్మయమున ఉపనిషత్తుల యొక్క స్థానము చాలా ప్రముఖమైనది. ఉపనిషత్తులందు మహర్షులు తెలిపిన వాక్యములు ముముక్షువులకు పరమ ప్రమాణములు. నిగూఢములైన ఆధ్యాత్మికతత్త్వములు సాధకులకు చక్కగ హృద్గతమగుట కొరకై ఉపనిషత్తులలో ఎన్నియో ఉపమానములు, కథలు తెలుపబడినవి. తిరుపతి వాస్తవ్యులగు శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు అట్టి 21 కథలను సేకరించి తెలుగు భాషలో తేటతెల్లముగా వివరించి గ్రంథరూపముగ ప్రకటించిరి.

భావము సులభ గ్రాహ్యముగా యుండుటవలనను, భాష సులలితముగా నుండుటవలనను ఈ గ్రంథము ముముక్షువులకు ఎంతయో ప్రయోజనకారిగ యుండుననుటలో సంశయములేదు. పరమార్థ జిజ్ఞాసగలవారు ఈ గ్రంథమును లెస్సగా ఆదరించి, మహర్షుల ప్రబోధములను ఆచరణయందుంచి పరమశాంతిని అనుభవించుదురుగాక!

రచయిత– శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు
ప్రాప్తిస్థానము– శ్రీ మలయాళ సద్గురు సేవా సమాజము
621/ఎ, శ్రీపురం కాలనీ, తిరుపతి–517 507
**పుటలు–176, వెల : రూ.15/–**

## శ్రీ కారుణ్యానందస్వామి జీవితచరిత్ర

శ్రీ కారుణ్యానందస్వాములవారు గొప్ప ఆధ్యాత్మిక సేవాతత్పరులు. జీవ కారుణ్యమే వీరి సిద్ధాంతము. బహుకాలము నుండియు వీరు ఆధ్యాత్మిక సేవ యొనర్చుచు బహుముఖములుగా ప్రజలకు సేవ గావించుచు ప్రస్తుతము పుట్టపర్తి యందు ప్రశాంతి నిలయమున శ్రీ భగవాన్ సత్యసాయిబాబాగారి సన్నిధియందు పరమార్థసేవ గావించుచున్నారు. వారి జీవిత విశేషములు ఈ గ్రంథమునందు గలవు ప్రముఖ వక్తయు, ప్రముఖ రచయితయు అగు శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు సులలితమైన తెలుగుభాషలో ఈ గ్రంథమును రచించిరి.

**ప్రాప్తి స్థానము- శ్రీ వ్యాసాశ్రమము (P.O.)**
**ఏర్పేడు-517 621, చిత్తూరు జిల్లా**
**పుటలు-145**

## శ్రీ సాయి బోధ (భక్తిగీతావళి)

**పుటలు-63**

శ్రీ పొన్నూరి వెంకటరమణమ్మ గారు శ్రీ షిర్డీసాయిబాబా వారిని గురించి వ్రాసిన గీతముల సంపుటియే ఈ గ్రంథము. భక్తిభావము పెంపొందుటకు ఈ గ్రంథము బాగుగ తోడ్పడగలదు.

**ప్రాప్తి స్థానము- శ్రీ పొన్నూరి వెంకటరమణమ్మ గారు**
**పాత పట్టాభిపురం, గుంటూరు-6**

OO

Truth, purity and unselfishness equipped with these one individual is able to face the whole universe.

**సత్యము, పవిత్రత, నిస్స్వార్థత- అను ఈ సద్గుణములు కలిగియున్నవాడు- ప్రపంచమునంతను జయింప గలుగును.**

# ఆస్పత్రి సమాచారము

## శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు స్థాపించబడిన త్రినేత్ర వైద్యాలయము శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రిలో గావించబడిన వైద్యసేవ యొక్క వివరములు

| నెల | [illegible] | [illegible] |
|---|---|---|
| మే | 16 | 435 |
| జూన్ | 89 | 1,747 |
| జూలై | 69 | 1,950 |
| Total | 174 | 4,132 |

**వారానికి 20 ఆపరేషన్లు చొప్పున చేయుటకు సెప్టెంబరు 12వ తారీఖు వరకు ముందుగా రోగులకు తారీఖులు ఇవ్వడమైనది.**

ఇట్లు
Dr. M.S. Ramakrishna Rao
B.Sc., M.S.D.O.
Spl Gr. Civil Surgeon (Ophth)

---

*(31వ పేజీ తరువాయి)*

12\. రామాలయములందు రామనామము
రమ్యముగ పాడుచుండ్రు రామనామము ॥పా॥
13\. శ్రవణేంద్రియంబుల రామనామము
శ్రావ్యముగ వినగ రండి రామనామము ॥పా॥
14\. కరతాళధ్వనులతో రామనామము
కరమొప్ప జేయండి రామనామము ॥పా॥
15\. హరేరామ హరేరామ । రామ రామయనండి
హరేకృష్ణ హరేకృష్ణ । కృష్ణ కృష్ణయనండి ॥పా॥
16\. హరేరామ హరేరామ । రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ । కృష్ణ కృష్ణ హరే హరే ॥పా॥ OO

| | | |
|---|---|---|
| 27. | పి. సరస్వతమ్మ – శ్రీకాళహస్తి | 1,116/– |
| 28. | నామా ఎరికలయ్య – ప్రొద్దుటూరు | 1,200/– |
| 29. | అగిశెట్టి వేంకటసుబ్బయ్య – నంద్యాల | 2,500/– |
| 30. | వి. రామచంద్రుడు –డోన్ | 2,500/– |
| 31. | కె.బి. మల్లయ్య – బోధ్ | 1,116/– |
| 32. | బి.వి. సుబ్బారావు – భీమవరం | 3,000/– |
| 33. | సత్రసాల పెద్ద వేంకటసుబ్బయ్య & Sons | 3,116/– |
| 34. | ఎన్. పద్మావతమ్మ ట్రస్టు – మద్రాస్ | 1,001/– |
| 35. | ఎమ్. రామరాజు – కర్నూలు | 1,116/– |
| 36. | పి. చంద్రశేఖరరావు – R. అగ్రహారం | 1,116/– |
| 37. | జూటూరి కృష్ణమూర్తి – ప్రొద్దుటూరు | 516/– |
| 38. | ఎస్. ఈశ్వరమ్మ – మార్కాపురం | 1,116/– |
| 39. | వీరాంజనేయ చరణ్ – తూర్పుపాతకోట | 700/– |
| 40. | బి. రంగస్వామి – కర్నూలు | 1,116/– |
| 41. | టి.వి. లక్ష్మయ్య – సికింద్రాబాద్ | 1,116/– |
| 42. | టి.వి. జగదీశ్వరరావు – సికింద్రాబాద్ | 1,116/– |
| 43. | ఎమ్. రాజయ్య గుప్త – భువనగిరి | 1,116/– |
| 44. | జె. నరసింహారావు – సికింద్రాబాద్ | 1,116/– |
| 45. | సిహెచ్. రాధాకృష్ణ – సికింద్రాబాద్ | 1,116/– |
| 46. | టి.వి. రాజేశ్వరరావు – సికింద్రాబాద్ | 1,116/– |
| 47. | వి. సింహాచలం – హైదరాబాద్ | 500/– |
| 48. | సాగి సూర్యనారాయణమ్మ – తిరుమల | 1,116/– |
| 49. | గీతా ప్రచార సమితి – విశాఖ | 1,116/– |
| 50. | రాధాకృష్ణ పతంగి – మహబూబ్‌నగర్ | 1,016/– |
| 51. | పి. గోవిందప్పశెట్టి – బళ్ళారి | 1,000/– |
| 52. | పి. రామమూర్తి – మద్రాస్ | 1,116/– |
| 53. | డి. ధర్మారావు – పాండిచ్చేరి | 2,000/– |
| 54. | రాయుడు కృష్ణమూర్తి – మద్రిపాక | 1,116/– |
| 55. | డి. వేంకట లక్ష్మీనరసింహారావు – ఈదర | 1,116/– |

56. కొత్తపల్లి సుబ్బరాజు – పాలకోడేరు 1,236/–
57. ఎమ్. రఘురామిరెడ్డి – హైదరాబాద్ 1,000/–
58. రామమూర్తి & Friends – శ్రీకాళహస్తి 1,116/–
59. బుర్రంశెట్టి సుబ్రమణ్యం – సింగరాయకొండ 1,116/–
60. మారం మురళీనాథ్ – కర్నూలు 2,500/–
61. వేంకటేశ్వర థియేటర్ – దుబ్బాక 2,116/–
62. కె. శ్రీనివాస్ – కొల్హాపూర్ (M.S.) 1,116/–
63. ఎ. రామమూర్తి & అనసూయ – ఖమ్మం 1,000/–
64. బి. సుబ్రమణ్యశాస్త్రి – విజయవాడ 1,000/–
65. పి. యర్రయ్య – లాంగ్టింగ్ (అస్సాం) 1,000/–
66. సోమా సరస్వతి – సికింద్రాబాద్ 1,116/–
67. సోమా ఈశ్వరయ్య – సికింద్రాబాద్ 1,116/–
68. Rtn. వి. లక్ష్మణరావు గార్లు – విశాఖ 1,000/–

శ్రీకాళహస్తి రోటరీ క్లబ్బువారి విరాళము : 60 మంది కంటి రోగులకు ఆపరేషన్స్ కొరకు అగు ఖర్చును రూ.12,000/–లను విరాళముగా సమర్పించిరి. (ఒక్కొక్క ఆపరేషనుకు రూ.200/–లు)

భక్తులు ఈ విధముగా అమితోత్సాహముతో, భక్తిశ్రద్ధలతో ఈ నేత్ర చికిత్సా యజ్ఞములో పాలు పంచుకొనుచున్నందులకు సంతోషించు చున్నాము.

ఇంకను ఈ యజ్ఞమునకు విరాళములు అందుచున్నవి. రాబోవు సంచికలో మరికొందరి దాతల పేర్లు ప్రకటింపబడగలవు.

*విరాళములు పంపదలంచువారు M.O. ద్వారాగాని, ఏ బ్యాంకునుండి తీయబడిన డిమాండు డ్రాఫ్టు గాని ఈ క్రింది అడ్రసుకు పంపవచ్చును.*

**శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి**
(Bhakta Kannappa Free Eye Hospital)
శ్రీ శుకబ్రహ్మాశ్రమము–517 640 శ్రీకాళహస్తి (A.P.)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-

1. శ్రీ డా॥ వి.ఎస్. ప్రసాదు గారు – సికింద్రాబాద్
2. శ్రీమతి పి. నాగరత్నమ్మ గారు – నంద్యాల
3. శ్రీ ఎస్. రమణయ్య గారు – నల్లబెల్లి
4. శ్రీ బి. చిన్నలక్ష్మణరావు గారు – కాకినాడ
5. శ్రీ వై. మద్దిలేటి గారు – శంకరాపురం
6. శ్రీ వి. భూమయ్య గారు – బొంబాయి
7. శ్రీ జి. నిటలాచలం గారు – ఉక్కుంబ (ఒరిస్సా)
8. శ్రీ ఎస్.ఎమ్. శ్రీనివాసరెడ్డి గారు – శ్రీనివాసపూర్
9. శ్రీ వూటూరి మల్లేశం గారు – జగిత్యాల
10. శ్రీ డా॥ వై. సత్యనారాయణ గారు – కర్నూలు
11. శ్రీ బి. దేశాయి రెడ్డి గారు – మిక్కినేనిపల్లె
12. శ్రీ టి. లింబాద్రి గారు – చకిర్యాల
13. శ్రీ ఎస్. సుబ్రమణ్యం గారు – రాజంపేట
14. శ్రీ ఎస్. నారాయణశెట్టి గారు – రాజంపేట
15. శ్రీ ఆత్మకూరు మల్లికార్జునరావు గారు – బెంగుళూరు

OO

**a man-making religion that we want.**

**మానవత్వమును కలుగజేయు మతమే మనకిప్పుడు కావలసినది.**

Printed and Published by Vemuri Balaram for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada

**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1-15

(సంగ్రహము)

దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య
వశీకారసంజ్ఞావైరాగ్యమ్

**తా।** చూచినట్టిగాని, వినినట్టిగాని విషయములను గూర్చిన ఆశ లేకుండుటయే వైరాగ్యము.

వ్యాఖ్య : చూచినట్టిగాని, వినినట్టిగాని విషయముల యెడల తృష్ణ, అనురాగము లేకుండుటయు; ఇహలోక పరలోక భోగముల యెడల ఏ మాత్రము ఆసక్తిలేకుండుటయు వైరాగ్యమని చెప్పబడును. ప్రమిదలో దీపము వెలుగుటకు ప్రమిద ఎట్లు ఆధారభూతమై యున్నదో, అట్లే జ్ఞానమను జ్యోతి వెలుగుటకు వైరాగ్యమను ప్రమిద ఆవశ్యకమై యున్నది. మనస్సు బహిర్ముఖము ప్రవర్తించినచో, విషయములవైపు పరుగిడుచుండినచో అ అంతర్ముఖమెట్లు కాగలదు? ఆత్మానందమెట్లు పొందగలదు ఆత్మసాక్షాత్కారమను మోక్షస్థితి ఎట్లు బడయగలదు? కా మోక్షప్రాప్తికి ప్రప్రథమ సాధన వైరాగ్యమే అయియున్నది ముముక్షువగువాడు వివేకముయొక్క సహాయముచే వినిన, కనిన విషయములయొక్క అసారత్వమును గమనించి, అనిత్యత్వమును తెలుసుకొని వాటి యెడల అనురక్తిని వదలి వేయవలెను. ఇదియే వైరాగ్యము. వైరాగ్యముచే మనస్సు అంతర్ముఖము కాగలదు.

(అంతర్ముఖమనస్సు ఆత్మానందమనుభవించి ధన్యతనొందగలదు.)